# సమకాలికాభిప్రాయములు

## హైదరాబాదులో తెలుగు పత్రికలు

### ఒకగొప్ప ప్రభుత్వోద్యోగి "గోష్ఠి" పత్రికకు తెలిపిన సంగతి

బెజవాడనుండి వెలువడు "గోష్ఠి" పత్రికయొక్క వృషసం॥ ఆషాఢమాసపంచికలో "హైదరాబాదులో తెలుగుపత్రికలు" అను శీర్షికక్రింద ఈక్రిందివిధముగ వ్రాయబడినది –

మాపత్రిక ఏప్రిలుమాసపంచికలో ఆంధ్రసంపాదకుల మహాసభనుగురించి వ్రాసినవ్యాసముపై మ॥ ఘ॥ వ॥ నిజాం ప్రభుత్వమునందలి ఒకగొప్ప ఉద్యోగి హైదరాబాదు సంస్థానములో తెలుగుపత్రికలు ఎట్టి పరిస్థితులలో వృద్ధిచెందుచున్నవియు వివరముగ వ్రాసినారు. అలేఖయందలిముఖ్యవిషయములను, అందుపై మేముపంపిన ౨ లేఖకు వారిచ్చిన సమాధానమునుకూడ మేము ఈక్రింద తెలియబరచుచున్నాము.

-౫-౧౯౪౧ నాటి లేఖ

"ఆంధ్రసంపాదకుల తీర్మానమునుగూర్చి వ్రాయవలెననగా, తెలుగుపత్రికలకై చాల తక్కువ దరఖాస్తులువచ్చియున్నవి. అట్లు అనుమతికోరిన కొద్దిమందికూడ, ఉర్దుమున్నగు ఇతరదేశభాషాపత్రికలవిషయంలోను అవలంబించే గణనప్రకారము, అనుమతినివ్వలేదు. గోలకొండ పత్రిక అను తెలుగుపత్రిక చాలకాలమునుంచి ఉన్నది. అది ఎప్పుడును ఆపబడియుండలేదు– సుమారురెండేండ్ల క్రింద రయ్యత్ అను పత్రికయొక్క సంపాదకులగు నరసింగరావుగారికి ఒక తెలుగుపత్రిక తీయుటకు అనుమతి ఇవ్వబడియుండెను అయితే, అదేకారణమో వారికే తెలిసియుండును, అపత్రిక బయటపడలేదు–ప్రసిద్ధులైన ప్రజాసేవకులగు శ్రీ మాడపాటి హనుమంతరావుగారికి "తెలంగానా" అను పత్రికనుప్రకటించుటకై అనుజ్ఞ ఇవ్వబడినది–మాకు తెలిసినంతవరకు అపత్రిక త్వరలో వెలువడునని ఎదురుచూచుచున్నాము

"ఆంధ్రులకు సంబంధించినంతమట్టుకు, వారలకు నర్సింగరావుగారిచే సంపాదితము గు రయ్యత్ అను ఒక ఉర్దువారపత్రిక గలదు–వారు కూడ ప్రసిద్ధులైనప్రజాసేవకులు–వారు ఒక ఉర్దుదినపత్రికసంపాదించుటకై దరఖాస్తు పెట్టుకొనియుండిరి–దానికికూడ అనుమతియివ్వబడినది–అదియు కొద్దిరోజులలో రావచ్చునని ఎదురుచూచుచున్నాము."

౧౪-౭-౧౯౪౧నాటి లేఖ

"మేము లోగడవ్రాసినలేఖలో చెప్పినట్లు, క్రొత్త తెలుగుపత్రికలువచ్చుచున్నవి "రయ్యత్" దినపత్రికగూడ అప్పుడే ప్రారంభమైనది. "తెలంగానా" రేపోమాపో రావచ్చునని అనుకొనుచున్నాము.

"మీరు చెప్పినట్లుగా, మేము దినపత్రికలకును వారపత్రికలకును అనేకమైనసౌకర్యాల నిచ్చుచున్నాము–ఉదాహరణార్థము వార్తలను ధర్మముగాసప్లయిచేయించుట–కాని ఇదిఒక్కటే సౌకర్యముకాదు ఇకొకసౌకర్యమేమనగా కాగితము ధరపెరిగియున్న ఈకష్టకాలములో మేము కాగితములనుకొనిస్టాకుచేసి, దానిని స్థానికసంపాదకులతోను ప్రకటనకర్తలతోను ముందుగా వారలెంతతీసికొనేది ఏర్పాటు చేసికొని, ఆకాగితమును అసలు కొన్నధరకేవిక్రయించుచున్నాము"

బ్రిటిషు ప్రభుత్వముతో పోల్చిచూచినచో మ॥ ఘ॥ వ॥ నిజాం ప్రభుత్వము వార్తాపత్రికలయొక్క వ్యవహారములలో, అర్థికసౌకర్యాలకు సంబంధించినంతమట్టుకు చాలాఔదార్యము గలిగియున్నారనిమేము ఇక్కడ ఒప్పుకొనుట ఎటువంటిఅతిశయోక్తియు లేదు–కాని అసలు విషయమంతయు ఈ గొప్పసౌకర్యములో ఏమాత్రము లెక్కకురాదగినభాగమునైనను తెలుగుపత్రికలు పందుకొన్నవాయనునది–మాకు తెలిసినంతవరకు ఆసంస్థానములో ౧౧లక్షలమంది హిందూస్థానీలుండ దాదాపు ౯౦లక్షలమంది ఆంధ్రులున్నారు–కాని దాదాపు అర్ధడజను ఉర్దుదినపత్రికలు, అనేకవార, మాసపత్రికలున్నవియు ఉండగా మొత్తముమీద అయిదు తెలుగుపత్రికలకంటె ఎక్కువలేవు–వాటిలో ఒకటిద్విమవారపత్రిక, ఒకటి వారపత్రిక, మూడుమాసపత్రికలు–ఇందులోను మూడుబ్రిటిషు ఇలాకాలోని సికింద్రాబాదులోనివి, నాల్గవదగు మాసపత్రికస్థాపించి నాలుగుఅయిదునెలలు నిండలేదు–ఈసంస్థానంలోఇచ్చే ఈసౌకర్యాలకన్నింటికిని తెలుగుదినపత్రికలును, వారపత్రికలును మాటసాటిగతకు అర్హములై యుండవచ్చును– కాని ఈసంస్థానములో ఇన్నేండ్లనుండి ఒక్క తెలుగు దినపత్రికయైనా లేకపోవుటలో ఏదుకు? ఇదిఅడుగదగినప్రశ్నయే ఈపరిస్థితికి పైజెప్పిన గొప్పఅధికారినూచించినటుల ఆ సంస్థానపు ఆంధ్రులదే తప్పైనచో తెలంగానాయాయకులు త్వరలో మేల్కొని తాము అసంస్థానపు మరట్వాడీలకంటెను ముసల్మానులకంటెను వెనుకబడకుండునట్లు చూడవలెనని మేము కోరుచున్నాము టీంల మ॥ఘ॥వ॥ నిజాంగారు ప్రసాదించినట్టిధర్మానులు శ్రీవారి అన్ని తెగలప్రజలకును మత, భాషాదిభేదములతో నిమిత్తము లేకుండ సమానావకాశములనిచ్చు క్రొత్తయుగమును ప్రారంభించవచ్చునని మేము ఆశించుచున్నాము–ఈవిధంగా కలిగించబడినఅవకాశాలనుండి ఆంధ్రులు తమకు సాధ్యమైనంతవరకు లాభము పొందదగుదురు

---

# సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ యిండియా లిమిటెడ్.

1946 సంవత్సరపు 3 o/o డిఫెన్సు బాండ్లు కొనువారికై

సెంట్రల్ బ్యాంకువారి ప్రత్యేకస్కీము.

(1) సెంట్రల్ బ్యాంకు ఆఫ్ ఇండియా లిమిటెడ్ వారు 1946 సంవత్సరపు 3౦ నుపు బాండ్లు ప్రకటింపబడినరేటుప్రకారము యిత్తురు.

(2) బాండ్లకొరకు దరఖాస్తుచేయువారు తాముబాండ్లుకోరిన మొత్తములో ప్రతిశతి ౧౦ ను ముందుగా చెల్లింపవలయును. రు. 100 లకు అంతకుపైనగాని దరఖాస్తులు తీసికొనబడును

(3) తరువాత బాండ్లమొత్తము యీక్రిందివిధముగా చెల్లింపవలయును. మొదటి మూడు నెలలవరకు ప్రతిశతి ౫ గాని అంతకెక్కువగాని చెల్లింపవలయును, మిగతమొత్తము దరఖాస్తుచేసిన తేదినుండి రెండుసంవత్సరములలోగా కొన్ను వారిసౌకర్యము పారముచెల్లింపవలయును.

(4) బాండు విలువనుపూర్తిచేయుటకై చెల్లింపడిన కిస్తుమొత్తములపై బ్యాంకువారు నూటికి 2 1/2 వంతున వడ్డియిచ్చెదరు.

(5) పూర్తిమొత్తముచెల్లించిన తరువాత బాండ్లుయివ్వబడును.

(6) బాండుమొత్తముపూర్తిగా చెల్లించినతరువాత ప్రతిశతి 2 1/2 వడ్డిఆగిపోయి, బాండు యివ్వబడినతేదినుండి సరియైనవడ్డి చెల్లింపబడును

(7) బాండుయొక్క పూర్తిమొత్తమును చెల్లించకముందే అమ్మదలచినయెడల బ్యాంకువారు దానిని మార్కెటురేటుప్రకారము ఏమియుకమీషన్ లేకుండ నేయిచ్చి దానిపైయింకా చెల్లించవలసినబాకీమును పట్టుకొని మిగతిపైకమునిత్తురు.

హైదరాబాదు–దక్కన్ } మేనేజరు.

26—8—40 } కె. జె. వికాజీ

---

# విజయలక్ష్మి

## జనరల్ ఎష్యూరెన్సు కంపెనీ లిమిటెడ్.

ప్రధానకార్యాలయము–మదరాసు.

నిజాంరాష్ట్రములో అన్నిప్రాంతములలో జిల్లా ఆర్గనైజర్లు, ఏజంట్లు కావలెను. వ్యాపారమునకుకొద్ది పూచీమాత్రమే. లాభకరమైన ప్రతిఫలము. వివరములకు

కె. వెంకయ్యచౌదరి.

చీఫ్ ఆర్గనైజరు, ఖమ్మంమెట్టు (N. S R)

---

# వర్ణాంతర వివాహాలు

## పూర్వంలో చాలా ఉండెను.

## ఇప్పుడెందుకు కూడవు?

లాహోరులోని జాత్ పాత్ తోడకమండలియొక్క కార్యదర్శి వర్ణాంతర వివాహాలు శాస్త్రసమ్మతమేనని యీ క్రిందివిధముగా నిదర్శనములను చూపించుచు ప్రకటించినారు

ఈక్రింద చూపింపబడిననిదర్శనాలు చూచిన తర్వాత పూర్వాచార పౌరాణికవర్గమువారు తమ భావాలు మార్చుకోవలెను సంఘము బలిష్ఠము కావలెనంటే రక్తసమ్మిశ్రము కావలెను,

పూర్వకాలములో ప్రియవ్రతుడను క్షత్రియరాజు విశ్వకర్మఅను బ్రాహ్మణుని కూతురైన బార్హిష్మతిఅనుదానిని పెండ్లాడెను– నీపరాజాఅను క్షత్రియుడు బ్రాహ్మణశుక్రాచార్యుని కూతురైన కృత్విని పెండ్లాడెను–వీరిసంతతిలోనే ముద్గలుడుపుట్టెను–అతనిపేరిటి మౌద్గల్య గోత్రీకులు బ్రాహ్మణులలో ఇప్పుడు చాలామంది కలరు–ప్రమత్తఅను బ్రాహ్మణయువతి ఒకమంగలివానిని వివాహమాడెను వారికేమతంగమహామునిపుట్టెను

వశిష్ఠమహర్షి ఒకభోగముదానికిపుట్టెను–అతడు కర్దముడను క్షత్రియుని బిడ్డయగు అరుంధతిని పెండ్లాడెను–(అరుంధతి మాదిగదని ఒకప్రమాణమున్నది) వారికి శక్తిఅను పుత్రుడు జన్మించెను–వాడు అదృశ్యంతిఅను చండాలకన్యకను వివాహమాడెను–వారికి పరాశరుడుపుట్టెను– పరాశరగోత్రీ బ్రాహ్మణులిప్పుడు చాలామంది ఉన్నారు–(వివరణకై లింగపురాణాన్ని చూడుడు) అపరాశరుడు బెస్తవానిబిడ్డయగు సత్యవతినిపొందినాడు–వారికి వేదవ్యాసుడుపుట్టెను–అతడు అంబా అంబాలికలను విచిత్రవీర్యుని భార్యలనుపొంది ధృతరాష్ట్రపాండు విదురులనుపుట్టించెను–పాండురాజు భార్యకుంతి నియోగముచే ఇతరులనుపొంది పంచపుత్రులను కనెను–కర్ణుడు బభ్రువాహనుడు ఘటోత్కచుడు విదురుడు వీరంతా వర్ణాంతరవివాహ సంయోగసంజనితులే

ఇదంతా పౌరాణికకాలమునాటిమాట–చారిత్రికకాలములోగూడ మహారాజులే వర్ణాంతర వివాహాలను చేసుకొన్నారు– చంద్రగుప్తుడు ఒక బ్రాహ్మణస్త్రీని వివాహమాడినాడు–వారికి అశోకునితండ్రి పుట్టెను–(చంద్రగుప్తుడు గ్రీకు స్త్రీనికూడా పెండ్లాడెను) అశోకుడుగూడ విజాతీయయువతిని అనగా వైశ్య స్త్రీని పెండ్లాడెను–హర్షుడు బ్రాహ్మణుడు అతనుతనబిడ్డను ఒకక్షత్రియునికిచ్చెను. విక్రమాదిత్య చక్రవర్తి యొక్క యజ్ఞాచార్యుడైన వ్యాఘ్రకర్ముడు అనేవాడు వ్యాధ అని (పిట్టలుపట్టేవాని) కొడుకు–వాడు ఒకబ్రాహ్మణ యువతిని వివాహమాడెను–కృష్ణభట్టుఅనే బ్రాహ్మణుడు ఒక చండాలబాలికను మోహించి పెండ్లాడెను– వారిసంతతియే మాతంగవంశమని ప్రసిద్ధమైనది–

ఈయుంకాలనుబట్టి వర్ణాంతరవివాహము తప్పుకాదని విశదమగును

---

డాక్టరు

# శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

బెజవాడ (లేక) రాజమండ్రి

వారి యీ క్రిందిమందులు యీక్రింది వ్యాధులకు అమోఘముగ పనిచేయును.

ఆరోగ్యసుధ

సమస్తరోగసవాయివ్యాధులకు 60 మా॥ 4-0-0

స్త్రీసుధ

స్త్రీలసమస్తగర్భాశయవ్యాధులకు 60మా॥ 3-0-0

ఆనందసుధ

బలహీనత సమస్తవ్యాధులకు 8 జో॥ 2-8-0

ప్రదరామృతము

స్త్రీల శ్వేతరక్త ప్రదరములకు 60 మా॥ 4-0-0

ప్రమేహసుధ

సమస్త శుక్రనష్టములకు 60 మా॥ 4-0-0

రత్నసుధ

చర్మవ్యాధులకు రక్తనాళములకు 60మా॥ 4-0-0

దివ్యసుధ

గర్భిణీస్త్రీల సమస్తవ్యాధులకు 60మా॥ 4-0-0

సర్వసుధ

ముష్టిమైథునమువరములబలహీనతకు 60మా 10.00

సర్వామృతము

పాండువు, దుష్టమేహం మొదలైనవానికి 60మా 4-0-0

సుధానిధి

దగ్గు, ఆయాసము, క్షయలకు 60 మా॥ 4-0-0

బాలసుధ

బాలురజ్వరము, అజీర్ణము మొ॥ వానికి 60మా 1-0-0

దివ్యామృతము

శీఘ్రస్ఖలనము మొ॥ సమస్తవ్యాధులకు 60మా॥ 4-0-0

జ్వరసుధ

సమస్తజ్వరములకు 100 మా॥ 5-0-0

విషమ జ్వరసుధ

చలిజ్వరము మొ॥ వానికి 60 మా॥ 5-0-0

అజీర్ణసుధ

సమస్త అజీర్ణములకు 100 మా॥ 6-0-0

ఇంకను శాస్త్రీయమగు సమస్తాయుర్వేదౌషధములును అత్యుపయోగకరములగు వైద్యగ్రంథములును గలవు. కేటలాగుఉచితము

---

చర్మబాధల కన్నిటికి

# లెమ్యూశాన్ తైలము

ఎంపుకనగా, చిడుము ఏనుగుగజ్జి, మొలలు దురదు, చుండు, గడ్డలు మొదలైన చర్మవ్యాధులన్నిటికి లెమ్యూశాన్ అమోఘమై పని చేస్తుందని అందరు శిఫారసుచేస్తారు యింతేగాక, కాలిన పుండ్లు కోతలు కురుపులకు వెంటనే ఉపశమన మిస్తుంది యిది ప్రతియింట్లో తప్పక వుండవలసిన అవసరముంది. ఏలనన దానిఅవసర మెప్పుడు కల్గుతుందో మీరు చెప్పజాలరు పెద్దమందుల దుకాణము అన్నింటిలోను రు 1/4/-కు దొరుకుతుంది

స్టాకిస్టు సయ్యద్ అబ్దుల్ రజాక్ అండుకో తెప్పెగిఅండుకో, మొదలైనవి

యుద్ధానికిముందు విదేశముల నుండి బడినది.

---

బలహీనమైన బిడ్డలకు

# డొంగ్రే

## బాలామృతము

పుష్టియున్ను, బలమున్ను,

ఆరోగ్యము నిచ్చును

---

# సారస్వతారిష్టము

ఈసారస్వతారిష్టము మెదడునకుబలముచేకూర్చు దివ్యౌషధము. లాయర్లు విద్యార్థులు మెదడులో ఎల్లప్పుడు పనిచేయుకొనువారలకు వరప్రసాదిని ఇంతేగాక, సాంక్రామికమగు ప్రమేహాదివ్యాధులను, స్త్రీలగర్భాశయ రోగములను, బహిష్టులోపములనుపోగొట్టును అపస్మారము, గండమాల కామిలాతుడుపు సర్వజ్వరములను శమింపజేసి శరీరమునకుబలము పుష్టి చేకూర్చును సీ॥ రు॥ 1-12-0

**జీర్ణామృత లవణము:-** జీర్ణరోగ సంబంధమగు వ్యాధులన్నిటికి నిర్మూలము చేయుటకు పెట్టినదిపేరు అజీర్ణము, అరోచకము, పుల్లత్రేపులు మొదలుపోగొట్టి జీర్ణశక్తివివృద్ధి చేయును, మలబద్ధకమునుతొలగించి శరీరమును ఆరోగ్యస్థితిలో యుంచును.

## ఆయుర్వేదిక్ కెమికల్ వర్కు్స

ప్రొప్రైటర్: ఆయుర్వేదభూషణ, కె. మహాలింగప్ప, ఫరక్ నగర్.

భగవాన్ మెడికల్ అండ్ జనరల్ స్టోర్సు లిమిటెడ్, సికింద్రాబాదు.

# గోలకొండపత్రిక

వృషనామసం॥ర శ్రావణ శు॥ ౮

గురువారము


## జపాను ఎత్తులు.

యూరోపుఖండ పశ్చిమంలో ఇంగ్లాండు ఏవిధమైనద్వీపమో ఏషియాఖండానికి తూర్పులో జపానుకూడా అట్టిద్వీపమే. ఇంగ్లీషు దీవులెంతచిన్నవో జపానుదీవులుకూడా అంతచిన్నవే. ద్వీపమగుటచేత ఇంగ్లీషువారికి సముద్రబలము ఎట్లు అవసరమయ్యెనో జపానుకుకూడా అట్లే అవసరమగుచూవచ్చినది. ఇంగ్లీషువారి దేశము వ్యవసాయంగా స్వయం పోషకం కాదు. జపాను దేశమున్నూ అట్లే. అందుచేత ఉభయదేశాలున్నూ వ్యాపారంపైన ఆధారపడినవి. ఇంగ్లాండు సామ్రాజ్యం స్థాపించుకొన్నది. జపానుకూడా ఇంతో అంతో స్థాపించుకొన్నది. అది చాలదని ఇంకాయెక్కువ ఆశలోపడినది. ౧౯౧౪ నాటియుద్ధంలో ఇంగ్లీషువారి పక్షంలోచేరి కొన్ని చిన్నదీవులను తీసుకొన్నది. ఈయుద్ధంలో జర్మనీపక్షంగా ఉంటూవచ్చినది. జపానురాజ్యం చాలా చాకచక్యంతో పనిచేయుచున్నది. దానికి నీతి నియమంలేదు. తన దేశానికి సమీపంలోనే చీనాదేశం ఉన్నది. అది చాలా బలహీనమైన దేశం. దానిలోని దక్షిణ మంచూరియాఅను గొప్పమండలాన్ని అమాంతంగా కబళించివేసింది. ఉత్తరంలో కొరియాఅను మండలాన్ని ౧౯౦౫లో రష్యానుండి లాగుకొనెను. ౧౯౧౭లో రష్యాలో విప్లవము కల్లోలం జరుగుతూవుండగా కొరియాసరిహద్దులో రష్యావారి రైల్వేలైను లాగుకొనెను. నాలుగేండ్లక్రిందట తోడేలు మేకపిల్లతో తగవుపెట్టుకొన్నరీతిగా చీనాతన కేమో అపకారం చేసినదని కల్పనచేసుకొని దానితో యుద్ధానికిదిగెను. కాని చీనా అదృష్టంచేత దానికి చాంకేషేక్ అను మహానాయకుడులభించినాడు. ఉత్తమనాయకత్వం మాత్రం ఏమిచేయగలదు. చాంకేషేకునుతలదన్నేనాయకులుప్రపంచబాహ్యదేశాలలో కొల్లలుగాఉన్నారు. కాని ఏంలాభం. అయితే చీనాకేమిలాభంఅంటే, చీనాకు ఇతరదేశాలు సహాయంచేయుచూఉన్నవి. ఇతర దేశాలవారు చీనావారికేమైన రక్తసంబంధికులా? భాషాసంబంధికులా? సంస్కృతిసంబంధముకలవారా? లేక వారంతటిఅవ్యాజకరుణా సింధులా? ఏదిన్నీకాదు. ప్రతిదేశముకూడా తన స్వకీయోద్దేశమును మొదట చూచుకొనును. అదేవిధంగా జపానువిషయములోను ఇతరముఖ్య రాజ్యాలవారికి భయం ఏర్పడింది జపాను చీనాను అమాంతంగా మ్రింగివేస్తే దాన్ని ఇక అగబట్టశక్యముండదు. జపాను బహుసంవత్సరాలనుండి ఒకకొత్త సిద్ధాంతం లేవదీసింది. తెల్లజాతివారు యూరోపు అమెరికాఖండాలలోనే ఉండవలెను. జపాను మాత్రంఏషియాఖండాన్ని వశపరచుకొనవలెను! ఈ తప్పుడు సిద్ధాంతముయొక్క అర్థమేమంటే ఇంగ్లీషువారున్నూ ఫ్రెంచి, డచ్చివారున్నూ అమెరికావారున్నూ తుదకు రష్యావారున్నూ తమతమ ఏషియాఖండమందలి రాజ్యాలకు తిలోదకాలు వదలుకోవలసిందే. ఇంగ్లీషువారికి ఇండియా, బర్మా సిలోను మలయా బోర్నియో భాగం, గయానాభాగం, మరివందలకొలది చిన్న చిన్న దీవిగడ్డలు ఏషియాలో దాస్యదేశాలుగా ఏర్పడియున్నవి. అదేవిధంగా ఫ్రెంచివారికి ఇండోచైనావంటి దేశాలున్నవి. డచ్చివారి వైభవం అందరిని మించియున్నది. హాలెండు అనేదేశం మన హైద్రాబాదులోని రెండుజిల్లాలంతటి చిన్నదేశం. దానికి కూడ గులాందేశాలు ఈ ఏష్యాఖండంలోఉన్నవి. జవా, బోర్నియో, సుమిత్రా, గయానా, మున్నగుద్వీపాలువారి వశంలో ఉన్నవి. ఈ ద్వీపాలలో ౭కోట్లమంది నివసించుచున్నారు. ఈ ౭ కోట్లున్నూ డచ్చివారి గులాములే. అమెరికావారు అందరికంటే ఎక్కువ శ్రీరంగనీతులు చెప్పేవారు. కానివారికి ఫిలిప్పైన్ ద్వీపాలు గులాందేశాలుగా ఉన్నవి. ఈవిధంగా జపాను విజృంభించిందంటే ఈదేశాలకన్నింటికిని ముప్పే. రష్యావారు చీనాప్రక్కనిదేశంవారు. ౧౯౦౪లో రష్యావారికిన్నీ జపానువారికిన్నీ యుద్ధంజరిగెను. అందు రష్యాయే

"కుంజర యూథంబు
దోమకుత్తుక చొచ్చె"

అన్నరీతిగా ఓడిపోయెను. అప్పటినుండియు రష్యాజపానుదేశాలకు స్పర్ధలేయున్నవి. ఈకారణాలచేత చీనావారికిరష్యావారున్నూ బ్రిటిషువారున్నూ అమెరికావారున్నూ సహాయం చేస్తున్నారు. ఫ్రెంచి, డచ్చివారు ఎందుకు చేయుటలేదనగా వారు యీయుద్ధంలో తమసొంతస్వాతంత్ర్యాన్నే పోగొట్టుకొన్నారు. జపానువారికి చీనాకు రష్యాచేసే సహాయంవల్ల చాలాకోపం ఉన్నది. అదేవిధంగా జపానువారు ఇంగ్లీషువారిపై పండ్లు పటపట కొరుకుతూనే ఉన్నారు. జపాను ఎప్పుడున్నూ ఒకరి యిబ్బందిని గుర్తించి చేయిచేసుకుంటుంది. ఇంగ్లీషువారు గత సంవత్సరం చాల యిబ్బందిలోఉండగా జపాను వారిని బెదరించి మూడునెలలవరకు బర్మారోడ్డును మూయించి చీనాకు సహాయంపోకుండా చేసెను. ఈరెండేండ్లనుండి అమెరికాను బెదరించుకుంటూ అక్కడినుండి నూనె, మున్నగుయుద్ధసామగ్రిని తెప్పించుకుంటూఉండెను తాను జర్మను స్నేహితుడైనందున రష్యాకు భయముపెట్టుతూనే యుండెను. ఇప్పుడు రష్యాకు జర్మనీకి యుద్ధంఏర్పడింది. మళ్ళీదొరికిందిరానందు అని జపానుఅనుకొన్నది. ఈయింగ్లీషు జర్మనుయుద్ధంలో ఫ్రాన్సు పోలెండు పడిపోయినతర్వాత జపాను భావాలు చాలా మారినవి. పైరెండు దేశాలకు దాస్యదేశాలైన ఇండోచీనా, జవా, బోర్నియో మున్నగుదేశాలకు ఇక నాథుడెవడు? నేనె ఎందుకు నాథుడనుకాకూడదు? తాయిదేశము (శ్యామ) అనురోగిదేశ మొకటియున్నది. దాని నెందుకు కబళించకూడదు. ఫిలిప్పైన్ దీవులున్నవి. అవి నానముద్రములోనివేకదా! అనే ఊహాలు, పగటికలలు, ఎన్నెన్నో జపానుకు కలుగుతూవచ్చినవి. ఆకలలను నిజముగు నట్లుచేసుకొనుటకై గత వారం ప్రారంభించిరి.

అకస్మాత్తుగా ఫ్రాంసుకు కోటీసు ఇచ్చింది. ౪౮ గంటలలోగా మీ మీ ఇండోచీనాలోని రేవులు, విమాన స్థానాలు నాకువశపరచవలెను. లోపల యేమేమితంత్రము జరిగిందోయేమోకాని ఫ్రాన్సు జపానుకు లోబడిపోయింది. కోరిన స్థానాల ఇచ్చివేసింది. ఇండోచీనాకు పడమటి ప్రక్కదేశం తాయి దానిప్రక్కనిది బర్మా, దానిప్రక్కది హిందూస్థానము.

ఇండోచీనాలో అన్నాం, టాంకింగ్, కాంబోడియా అను దేశాలు చేసినవి. కాంబోడియాను పూర్వము భారతదేశ హిందువులు ఆక్రమించుకొనివలస రాజ్యముగాచేసుకొని దానిని నాగరికదేశముగా వృద్ధికి తెచ్చియుండిరి. ఇండోచీనా మంచిసారవంతమగు దేశము. మంచిపంటలుపండును. విశేషంగాఅచ్చటిజనులు బౌద్ధులైయున్నారు. క్రైస్తవ పాదరీలు అక్కడకూడా తమ ప్రచారం బాగాచేసి కొన్నిలక్షలమందిని క్రైస్తవులనుగా చేసినారు. ఇట్టిసారవంతమగు దేశమును జపాను ఆక్రమించుకొన్నందువలన చీనాకు గొప్పనష్టం కలుగుతూ ఉన్నది. పైగా బర్మాకు ప్రమాదంగా ఉంది. అమెరికావారి ఫిలిప్పైన్ ద్వీపాలకును ప్రమాదమే. ఈకారణాలచేత అమెరికావారు జపానువారి వ్యాపారద్రవ్యము తమ అమెరికాలో ఎంతఉన్నదో దానినంతయు జప్తీచేసినారు. అయితే జపాను కట్లుకాబోతుందని తెలియదా? తెలియును. అందుచేతనే జపానుదేశ ద్రవ్యం అమెరికావో (౧౩.౧౦) కోట్ల డాలర్లు మాత్రమే! జపానువారున్నూ అమెరికాపై అదే అస్త్రాన్ని ప్రయోగించినారు. జపానులో ఉండే అమెరికా ద్రవ్యంజప్తీ! అనిఅన్నారు. అనగా జపానులో అమెరికావారి (౨౧౨) కోట్లడాలర్లు ఇరుకుకొని పోయియున్నవి. అంటే జపానుకే లాభమైంది.

ఇంగ్లీషువారున్నూ అదేవిధంగా జపాను ద్రవ్యం తమసామ్రాజ్యంలోజప్తీ అని అన్నారు. జపాను ఇకముందు అమెరికా ఇంగ్లీషు సామ్రాజ్యాలతో వ్యాపారంచేయజాలదు.

ఈ విధంగా యూరోపుయుద్ధం అఖిల ప్రపంచయుద్ధంగా మారేసూచనలుగట్టిగా కనిపించుతూఉన్నవి. ఆమహాభైరవుడు ప్రళయతాండవ నృత్యమేవిధంగాచేయనున్నాడో యేమో?

---

### మిల్లుసమ్మె

ఔరంగాబాదులో మిల్లుపనివారు గతవారము సమ్మెకట్టినారు- కూలివారు ఎక్కువకూలీ అనుకోరినారు మిల్లుయజమానులియ్యలేదు- అందుపైసమ్మెజరిగెను మిల్లుమూయబడెను ఆసందర్భములో షేక్ శాసేగారున్నూ డీ-సీతారాంగారున్నూ అతారాంగారున్నూ అరెస్టుచేయబడిరి కూలివారు ౨౦౦౦ మంది కూలీలు సమ్మెకట్టినారు-

---

# నిజాంస్టేటు రైల్వేఉద్యోగి సంఘము

## ఎంప్లాయీస్ యూనియన్ కార్యదర్శి నివేదిక

సికింద్రాబాదు [దక్కన్] జూలై ౨౦ తేదియెక్కడ జంక్షన్ హాలులో ఉదయం ౯గంటలకు మహమ్మద్ ఫాతుల్లాఖాన్ గారి అధ్యక్షతన నిజాంస్టేటు రైల్వేఉద్యోగిసంఘము యొక్క సంవత్సరసమావేశము జరిగెను- అందులో ఎంప్లాయీస్ యూనియన్ కార్యదర్శి చదివిన ౧౪ వ వార్షిక నివేదికలో ఈక్రిందివిషయములున్నవి.

మాయూనియన్ పదునాల్గవ వార్షికనివేదిక ౩౧-౩-౪౧ తో గతసంవత్సరము ముగిసినది ఈసంవత్సరము రయిల్వేపనివారిజీవితములో చాలప్రాముఖ్యతవహించెను రయిల్వేఅధికారులు మాయందు చీలికలకేర్పరచి మాసంఘమును కుంగదీయుటకు చాలప్రయత్నించినను, నానావిధములగు వక్రమార్గములవలంబించినను పనివారి ఐకమత్యము, వారికిసంఘముపైగల యభిమానము అగ్నిపరీక్షకుగురియైనను, చాలగండిపోచ్చగాసభ్యులయి సంఘముపై అమితమగు అభిమానమును శ్రద్ధనుచూపిప్రశంస్యముగ ప్రవర్తించిరి-

శ్రీఫతుల్లాఖాన్ గారి నాయకత్వంలోను, అధ్యక్షతలోను, యూనియన్, రయిల్వే ఉద్యోగులనమ్మకమును గౌరవముకేగాక, ప్రజాభిమానమును, ఇతరసంస్థల సహకారమును పొందకలిగినది-

యూనియన్ చందాదారుల సంఖ్యలో నికరముగా ౧౬౨ మంది యెక్కువగనున్నారు- ఈసంవత్సరాంతమున మొత్తము ౪౬౨౨-

ఈసంవత్సరపు ఆదాయవ్యయపట్టీలను గవర్నమెంటు ఠీప్లమాపొందిన రిజస్టర్డ్ అకౌంటెంటులయిన మూర్తీ ఎండు కంపెనీవారు తనిఖీచేసినారు- చట్టప్రకారముగ యివన్నియు రిజస్ట్రారు గారికి పంపబడుచున్నవి,

ఈసంవత్సరపు ఆదాయము రూ-౫౧౦౦-౬-౩ కల్దారును, ౩౩౪-౨-౧౦-౭ హాలీయు నుండినదిగత సంవత్సర ఆదాయము ౪౪౨-౬-౦ కల్దారు ౩౬-౩-౧-౨-అన్నూ హాలీ ౩౬౯-౨-౨-౧ అయియున్నది వ్యయము కల్దారు ౪౪౭-౬-౦న్నూ హాలీ ౪-౨-౪-౧౩-౦అయి గతసంవత్సర వ్యయము ౧౧౪౯-౩-౮ కల్దారు ౩౩౯-౩ రూపాయల ఆయిదుపయిసలు హాలీఅయ్యెను

ఈసంవత్సరమున ౩౦ ఎగ్జిక్యూటివ్ కమిటీ మీటింగులును, ౫౩ మాసుమీటింగులుజరిగినవి. లైనుపైనంతటికూడతీవ్రప్రచారము జరుపుటచేగాక ముఖ్యప్రదేశములలో బహిరంగసమావేశములు కూడజరిగెను. ఈసమావేశములందెన్నియో ముఖ్యవిషయములు తీర్మానింపబడినవి.

ఈసంవత్సరమంతయు అధికారులు యూనియన్ కు చాలవిరుద్ధమగు ప్రచారము సుస్వేచ్ఛతో సాగించి యూనియన్ గౌరవమును తీంచపరచప్రయత్నించినారు. మేనాల్గవ తేది ౧౯౪౦ సంవత్సరమున మాయూనియన్ రికగ్నిషను వాపసుతీసుకోబడినది పెద్దపెద్దజీతగాండ్రను బలవంతపరచి వారిసహాయముతో యూనియన్ కువ్యతిరేకముగ వేరొకసంఘమును నెలకొల్పయత్నించి విఫలులైనారు

ఈకృషియంతయు విఫలముకాగా మరొక క్రొత్తపద్ధతిని అధికారులవలంబించినారు స్టాఫ్ కమిటీలను ఒకక్రొత్తకమిటీలనేర్పరచి వాటిమూలమున ప్రాతినిధ్యమును నెలకొల్పి యూనియన్ ను భంగపరచ యత్నించుటచే ఆకమిటీలన్నిటికిని యూనియన్ తనసభ్యులను నెలకొల్పి వశముచేసుకొనవలసివచ్చినది- ఈ ప్రయత్నములో నూటికి ౭౫ స్థానములనుగడించి యూనియన్ అఖండవిజయమునుపొందెను-

స్వాభావికంగా యూనియన్ బులిటెను ఫతుల్లాఖాను గారి సంపాదకత్వంలో వెలువడుతు నేయున్నది- ఇదియూనియన్ అంగములలో ఒకటియగుటచే దీనిద్వారా రయిల్వే యుద్యోగుల కష్టములన్నియు బయటపెట్టబడినవి

మాయూనియన్ అఖిలభారత రయిల్వే ఉద్యోగులసంఘముతో సంబంధముకలిగివారితో భాగస్వామిగనున్నది ఈసంఘమునకును, గవర్నమెంటు ఆఫ్ ఇండియావారి రయిల్వేబోర్డునకును జరిగినసమావేశములలో ౧౯౪౧ జనవరి ఆరవతేదీ నేటు మాతరపున పాల్గొనుటకాశము దొరికెను- అందువలన సౌకర్యములోసగినందుకు జనరల్ మేనేజరుగారికి కృతజ్ఞాడను-

రయిల్వే ఉద్యోగుల హక్కులనుగురించి దొరతనమువారికి ౧౫-౬-౧౯౩౯ తేదిని పంపినిన మెమొరండమునందలి సూచనలు న్యాయబద్ధములనియు సమంజసములనియుగుర్తించి స్టేషన్ మాస్టర్లు, అసిస్టెంట్ స్టేషన్ మాస్టర్లు, పాయింటుమెన్లు, ఇంజనీరింగు పనివారు ఎడిట్ క్రెన్ పనివారు మొదలగు వారికిజీతములన్నియు హెచ్చింపబడినవి చిన్నజీతగాండ్రను ప్రావిడెంటు ఫండులోచేర్చుకొనసౌకర్యముకూడ యొసగబడినది ఈసౌకర్యములుకలిగించిన జనరల్ మేనేజరుగారికిని ప్రభుత్వమువారికిని నాకృతజ్ఞను ప్రకటించుచున్నాను-

చాలముఖ్యమైనదియు వెంటనేప్రవేశపెట్టవలసినదియునగు, పనివారికి తగినవిశ్రాంతినికలిగించునదియునగు "జనివాహాంగుట్సు అవర్సు ఆఫ్ ఎంప్లాయిమెంటు రూల్సు" మనరయిల్వేలో యింకాప్రవేశపెట్టలేదు- ఇతర రయిల్వేలన్నియు ఈచట్టమును అమలునకుతెచ్చినా ఇక్కడతేకపోవడము విచారించతగినవిషయము ఈచట్టము యీరయిల్వేలో వర్తింపబడినయెడల పనివారికి తగినవిశ్రాంతి కలుగుటకవకాశము లభించును-

లోకోడిపార్టుమెంటు పనివారియందు అసంతృప్తి మిక్కుటముగనున్నది- వర్కుషాపులందలి పనివారు చాలకష్టపడిపనిచేయుచు యుద్ధసామగ్రిని తయారుచేయుచున్నారు వీరు చాలకాలమునుండి జీతము హెచ్చుకాకుండా పడియున్నారు- వీరు ఘనతవహించిన నైజాంప్రభుత్వముపైనను లోకల్ ప్రభుత్వముపైనను ఆశపెట్టుకొనియున్నారు,

ట్రాన్స్ పోర్టేషన్ డిపార్టుమెంటులోని తక్కువ జీతగాండ్రలో పాయింట్ మెన్ ౦౦ ౭౫ గంటలు పంచేయవలసివచ్చుచున్నది- రాత్రింబవళ్ళు ౨౦ రైళ్ళ రాకపోకలకు పిరుపనిచేయవలయును- ఈవిధముగా పనిచేయించుకొనెడము కలిసినప్పుడు శెలవునీయకపోవడము, ఈరెండు కష్టాలు మిక్కుటముగనున్నవి-

ఇంజనీరింగు డిపార్టుమెంటులో గ్యాంగ్ మెన్లకు చాలాకష్టములు సంభవించినవి- ఈబాధలకు ముఖ్యకారకులు పేరుపొందిన, ఛీఫ్ ఇన్ స్పెక్టరు, అసిస్టెంటు ఇంజనీరు (కాజీపేట, బెజవాడసెక్షను) డోర్నకల్ మేడిచలం, మదిర పెద్దపల్లి, కొండపల్లి పి. డబ్ల్యూ. డి. ఇన్ స్పెక్టర్లు చాలముఖ్యులు.

౧౩-౭-౪౦ తేదీన రైల్వేఉద్యోగుల కాన్ఫరెన్సు జరుపబడెను దీనికి, సెర్ అక్బరలీ ఖాన్. ఎల్-ఎల్-డి అండర్ కార్యార్థులు ఆధ్యక్షతవహించినారు. చాలమంది ముఖ్యనాయకులు యీసమావేశంలో పాల్గొనినారు.

మాయూనియన్ మహరాష్ట్రములో ముఖ్యమైనదేకాకుండ అందరికినిదారిచూపినది.ఈయూనియన్ చేసినకృషిచేతనేకదా ఘనతవహించిన నైజాంప్రభుత్వమువారు, మెటర్నిటీ బెనిఫిట్ ఆక్టు, వర్కుమెన్ కాంపెన్సేషన్ ఆక్టులను అమలులో పెట్టినారు ఇదిసంతోషింపదగిన విషయము- సంవత్సరమునకు పిదపజరిగినముఖ్యవిషయములు ఇట్లున్నవి -

స్టాఫ్ మీటింగులుజరిగి వాటిలో ఉద్యోగులకు కలకష్టములన్నియు అధికారులయెదుట పెట్టబడినవి ఈవిషయములపై చాలచర్చిజరిగినను ప్రత్యక్షముగ శూన్యమనేచెప్పవచ్చును. అందువలన స్టాఫ్ కమిటీసభ్యులందరు, ఇకముందు యూనియన్ కాగ్నిషను విషయమునొకదానిని గురించి రేనుబాటలాడవలయునని తీర్మానించుకొనినారు

ప్రభుత్వము ఇక రెండుబిల్లులను శాసనసభలో ప్రవేశపెట్టుచున్నారు, ఒకటిజీతముల బట్వాడాచట్టము, రెండవది ట్రేడ్ యూనియన్ చట్టము, ఈరెండిటివల్ల రాష్ట్రమందలి పనివారందరికి లాభముచేకూరగలదని తలంచుచున్నాము.

### తీర్మానములు

౨౦-౭-౪౧ తేదీన జరిగిన జనరల్ బాడీమీటింగునందేకగ్రీవముగ నామోదింపబడినతీర్మానములు ఇట్లున్నవి -

ఈజనరల్ బాడీ మీటింగువారు యింతగా దవర్కుషాపుపనివారు అహోరాత్రములు కష్టపడియుద్ధసామగ్రిని తయారుచేయుచు, సహాయమొనర్చుచున్నను, ఆకేసంవత్సరమునుండి అపబడినగ్రేడ్లను తెరవకపోవుట, వారికీతములహెచ్చింపకుండుటను ఖండించుచు, పనివారికిరావలసినహక్కులను వెంటనే ప్రసాదింపవలయునని జనరల్ మేనేజరు దొరవారిని ప్రార్థించుచున్నారు

